Registered No. M-4345.

# యుద్ధ సంచిక.

వాల్యుం II.] 1942 వ సం॥ మే నెల 8 వ తేది శుక్రవారం [నె 18 రు.



## మెడగాస్కరు దీవిని బ్రిటిష్‌వారు ఆక్రమించుట.

### ఈ ఆక్రమణవల్ల యుద్ధతంత్ర ప్రయోజనములు.

తూర్పు ఆఫ్రికాకు సమీపంలో మెడగాస్కరు అనే దీవి ఉన్నది. ఇది ఫ్రెంచివారిది. దీనిని ఆక్రమించవలెనని జపానువారు సంకల్పించిరి. ఈ సంగతి తెలుసుకొని బ్రిటిష్‌వారే దానిని ముందుగా మొన్న ఆక్రమించినారు. దీనివల్ల యుద్ధ తంత్రమునకు చాలా ప్రయోజనాలు కలవు.—

(1) హిందూమహాసముద్రంలో త్వరలోనే జపానువారితో నౌకా యుద్ధం సంభవింపగలదు. ఈ మెడగాస్కరులో బ్రిటిష్ నౌకాదళం మకాము చేయుటవల్ల, జరుగబోయే నౌకా యుద్ధంలో బ్రిటిష్‌వారికి జయము కలుగుటకు అవకాశం కలదు. ఇది చాలా మంచి ఆయువుపట్టువంటి స్థావరము.

(2) అమెరికానుంచి అనేక నావలు యుద్ధ సామగ్రులతో దక్షిణాఫ్రికాచుట్టు తిరిగి మెడగాస్కరు ప్రక్కగా ప్రయాణంచేసి పరిషియాకు చేరుచున్నవి. పరిషియానుంచి ఆ యుద్ధ సామగ్రులు రష్యాకు చేర్చబడుచున్నవి. ఆ యుద్ధ సామగ్రుల సప్లయివల్ల రష్యావారు జర్మను సైన్యాలను చావగొట్టుచున్నారు. కాని యీ మెడగాస్కరును జపానువారు ఆక్రమించినట్లయితే, యీ అమెరికను నావలను త్రోవలోనే ముంచివేసి ఆ యుద్ధ సామగ్రులను రష్యాకు చేరనివ్వరు. ఇప్పుడు ఆ శత్రుభయం లేకుండా బ్రిటిష్‌వారే దానిని ఆక్రమించారు.

(3) మెడగాస్కరుమీదుగా అనేక ముడి పదార్థములను జపానువారు ఫ్రాన్సుకు పంపుతూ ఉండేవారు. కాని, ఆ సరకులు ఫ్రాన్సునుండి జర్మనీకి చేరుతూ ఉండేవి. ఇకముందు మెడగాస్కరుమీదుగా జర్మనీకి జపానువారు యీ సరకులను అందజేయలేరు.

(4) మెడగాస్కరును జపానువాళ్లు ఆక్రమించినట్లయితే, అక్కడనుంచి వాళ్లు బ్రిటిష్ దక్షిణాఫ్రికామీదకుకూడా దండెత్తగలరు. బ్రిటిష్ తూర్పు ఆఫ్రికామీదకు విమానదాడులను జపాను

వారు సులభంగా సాగించగలరు. అట్టి అపాయ భయంకూడా తొలగిపోయింది.

(5) మెడగాస్కరును జపానువాళ్లు ఆక్ర మించుకొని అచట ఒక స్థావర మేర్పరచుకొని అచటినుండి సూయజుకాల్వవరకు విజృంభించి మధ్య ప్రాచ్యప్రాంతాలలోకి దండెత్తి రాగల జర్మను సేనలతో జపాను సేనలు కలిసికొన వచ్చును. అటువంటి అవకాశము జపానువాళ్లకూ జర్మనులకూ లేకుండా, ముందుగానే మెడగాస్కరును బ్రిటిష్‌వారు ఆక్రమించారు.

అయితే, యిది ఫ్రెంచివారికి చెందిన దీవి. దీనిని బ్రిటిష్‌వారు శాశ్వతంగా ఆక్రమించుకొన వలెననే సంకల్పంతో ప్రవేశించలేదు. ప్రస్తుతం యుద్ధం జరిగినంతకాలమూ, అది శత్రువులకు చేజిక్కకుండా బ్రిటిష్‌వారే తమవశమందుంచు కొని, శత్రువును జయించిన తర్వాత, ఫ్రాన్సుకు తిరిగి స్వాతంత్ర్యము లభించినప్పుడు, దానిని తిరిగి ఫ్రాన్సుకు యిచ్చివేయవలెననే సంకల్పం తోనే బ్రిటిష్‌వారు దానిని ఇప్పుడు ఆక్రమించారు. ఈ మెడగాస్కరును జపానువారు ఆక్రమించు కొనకుండా బ్రిటిష్‌వారే దానిని ముందుగా ఆక్ర మించడం, జపానువారికి గొప్ప ఆశాభంగం. జపానుకు జర్మనీకికూడా గొప్ప పరాభవం.

# రెండు రంగములలో హిట్లరు పోరాడగలడా?

డెయిలీ టెలిగ్రాఫ్ అను పత్రిక తాలూకు రాజకీయ విలేఖరి ఆ పత్రికకు యీ క్రింది రీతిగా వ్రాసినాడు :—

ఒక మాసములోపుగానే జర్మను సేనలు రష్యా లోని బాకూవద్దఉన్న కిరసనాయిలు గనులమీదకు దండయాత్ర సాగించక తప్పదు. తిరిగి యీ సంవత్సరం శీతకాలం వచ్చేనాటికి, జర్మనులు దండయాత్ర ముగించవలెనంటే, ఒక మాసంలో పుగానే దండయాత్ర సాగించాలి. ఈ సమయం లోనే ఇంగ్లాండు వైపునుంచి జర్మనీమీదకు తీవ్ర మైన దాడిని మిత్రమండలివారు సాగించగలరనే భయం జర్మనీకి కలిగింది. అందువల్లనే జర్మ ను సేనలు అటు ఇంగ్లీషు చానెలు సముద్రతీర ప్రాంతాలలో ఎక్కువగా చేర్చబడుచున్నవి. అ క్కడ చాలా బందోబస్తులుకూడా చేయబడుచున్న వి. "నా సంకల్ప విధానము" అను పేరుతో హిట్లరు చాలాకాలం క్రిందట జర్మను భాషలో "మీన్‌కాంఫ్" అను పేరుతో ఒక గ్రంథమును వ్రాసియున్నాడు కాని, ఆ గ్రంథములో నిర్ణయిం చుకొన్న పథకము ప్రకారంగా హిట్లరుయొక్క యుద్ధ విధానం జరుగలేదు. రెండు యుద్ధ రం గములలో ఒక్కమారుగా జర్మనుసేనలు పోరా డకూడదనే పట్టుదల హిట్లరుకు మనస్సులో బాగా ఏర్పడింది.

అందువల్ల మిత్రమండలివారు జర్మనీమీదకు దూకించుటకు ఎంత బలమును సమకూర్చుకొను చున్నారనే విషయమై హిట్లరు కొన్ని అంచనా మదింపులను వేసికొనుచున్నాడు. అందుకు ప్రతి క్రియగా జవాబుచెప్పుటకు ఇంగ్లాండుకోస్తాకు ఎదురుగా ఉన్న జర్మను ఆక్రమిత రాజ్యాల కోస్తాలయందు తగినన్ని కట్టుదిట్టములను హిట్ల రుకూడా చేయుచున్నాడు. ఇచటి యుద్ధ రంగ మును యావత్తు సిద్ధపరచుటకు జనరలు రన్‌స్టెట్ అను జర్మను సేనానిని నియమించాడు. అతడు అక్కడ ఆయువుపట్టులవంటి ప్రదేశాలలో సిమెంటుతోను కంకరతోను నిర్మించవలసిన దుర్గ మ స్థానముల నన్నింటిని అతివేగంగా నిర్మించు చున్నాడు. బ్రిటిషువారి సేనలను మిత్రమండలి సేనలను అచట ఎదిరించగల్గుటకై కొంత సేనను సిద్ధపరచుచున్నాడు. ఇటలీసేనలను రుమేనియా బల్గేరియా మొదలగు బాల్కను రాజ్యాల సేనలనుకూడా తీసికొనివచ్చినప్పటికీ 55½ లక్షలు సేనగాని, 60 లక్షలు సేనగాని హిట్లరు సమా వేశపరచగలడు. అంతకంటె ఎక్కువ సేనను సమావేశపరచజాలడు, పై జెప్పిన సేన లోనే సుమారొక 5 లక్షల సేనను వెనుకశ్రేణిలో నిల్వగా యుంచుకొనవలసి యుంటుంది. రష్యను యుద్ధరంగంలో ఏ సమయంలోనైనా సైన్యం చాలకపోతే, యీ నిల్వ సైన్యాన్ని రష్యను రంగం లోకి పంపవలసియుంటుంది.

రష్యాలో ఇంతవరకు జరిగిన యుద్ధంలో జర్మనీకి చాలా జననష్టం సామగ్రినష్టం కలిగింది. ఎంతనష్టం కలిగినదో సరిగ్గా లెక్కలు తెలి యుటలేదు. కాని శీతకాలంలో రష్యనులు దివ్యంగా ఎదురుదెబ్బకొట్టి జర్మనులను వెనుకకు తరిమి వేసినారు. ఇది చాలా సాహసకార్యం. జర్మను

సేనలకు అప్పుడు కలిగిన జన నష్టమునుబట్టి చూడగా, తిరిగి యీ పర్యాయము రష్యామీదకు వచ్చి సవాలుచేయుటకు తగినంత రిజర్వుసేన హిట్లరుకు ఉన్నదా అనే విషయం సందేహాస్పదంగానే ఉన్నది. కాని, యీ సంవత్సరం - శీతకాలంలోకూడా రష్యాతో యుద్ధం సాగించవలెనంటే, జర్మనీ నిలువలేదు. కనుక, యీ సంవత్సరం సెప్టంబరు మాసం నాటికి, మధ్య ప్రాంచ్యంలో జర్మను సేనలు ముందంజవేసి నిర్ణయించుకొన్న స్థానాలను ఆక్రమించు కొనవలసియున్నది.

అందుకొరకై లిబియారంగంలో జనరలు రోమెలు అను జర్మను సేనాని నియమింపబడియున్నాడు. అతడు లిబియాలో యుద్ధంసాగించి సూయజు కాల్వవరకు పోవలసియున్నాడు. క్రీటువద్దనుంచి జర్మను విమానదళమును నడిపించి యీజిప్టుమీదకైనను సిరియామీదకైనను జర్మనులు దండెత్తవలెను.

మధ్యధరా సముద్రమునకు అడ్డంగా జర్మనులు తమ సేనను యుద్ధసామగ్రులను లిబియాకు చేరుస్తున్నారు. కాని వాటిని ఆ సముద్రం మీద పోనీయకుండా, మధ్య మార్గంలోఉన్న మాల్టా అను బ్రిటిష్‌వారి దీవివద్దనున్న బ్రిటిష్ నావలున్నూ బ్రిటిష్‌విమానాలున్నూ దారి కడ్డంగా ఉండి, జర్మను సేనలతో జర్మను సామగ్రులతో లిబియాకు పోవుచున్న జర్మను నావలను ముంచివేయుచున్నవి. అందువల్ల మాల్టామీదకు 600 జర్మను విమానాలువచ్చి బాంబులువేసి అచట బ్రిటిష్‌వారి ఆట సాగకుండా చేయవలెనని విశ్వప్రయత్నం చేయుచున్నవి. మాల్టామీదకు జర్మను సేనలను పంపుటకుకూడా ప్రయత్నం జరిగితే జరుగవచ్చును.

ఇటు తూర్పువైపునుంచి హిందూ మహాసముద్రముమీదుగా జపానువారు పడమరగా దండెత్తి వచ్చుటకున్నూ, అటు యూరోపుఖండంమీదుగా తూర్పుగా జర్మనీ సేనలు దండెత్తివచ్చుటకున్నూ ప్రయత్నములు జరుగుచున్నవి గనుక, ఈ కత్తెర వ్యూహంలోని ఉభయ శత్రు సేనలను కలియనియ్యకుండా, మధ్యనున్న బ్రిటిష్ సేనలను నొక్కకుండా, రెండు శత్రుసేనలను దూరంగానే ఉంచి భేదించుటకు బ్రిటిష్‌వారి యుద్ధతంత్రమును బ్రిటిష్‌వారు సాగిస్తున్నారు. ఇది యిట్లుండగా, జర్మనీమీదకు పడమటి వైపునుంచి (ఇంగ్లాండు వైపునుంచి) విమాన దండయాత్రలు వగైరా తీవ్రంగా సాగించుటకు నానాటికి బ్రిటిష్‌వారు తమ బలమును వృద్ధిచేయుచున్నారు.

జర్మనీకి పోరాట విమానములు చాలా తక్కువగానున్నవి. ఒకవేళ జర్మనీ ఎంత ఎక్కువగా విమానాలను సిద్ధపరచినప్పటికీ, రష్యాతో సమాన ఉజ్జీగా మాత్రమే యుండగలదు. కాని, పశ్చిమరంగంలో ఉన్న విమానాలనుకూడా రష్యను రంగంలోనికి తీసికొనివచ్చినట్లయితే పశ్చిమ రంగంలో జర్మను విమానబలం తగ్గిపోగలదు. కాబట్టి యీవిధంగా జర్మను విమానబలమునంతను ఒక్కసారిగా ఎదిరించవలసిన అగత్యము లేకుండా రష్యాకు కొంత యుద్ధభారమును తగ్గించుటకై బ్రిటిష్‌విమానాలు జర్మనీమీదకుదాడివెడలి కొంత జర్మను విమానబలమును అరికట్టగలవు.

# సైప్రసు దీవిలో బ్రిటిషువారి సర్వసన్నాహములు.

లండను టైమ్సు పత్రిక విలేఖరి సైప్రసునుండి యిట్లు వ్రాసెను :—

ఆసియాఖండ రాజ్యాలమీదకు జర్మను సేనలు దండెత్తి రావలెనంటే, సైప్రసుదీవి మీదకు ముందుగా దండెత్తవలసియున్నది. సైప్రసు దీవికి ప్రక్కనున్న టర్కీ రాజ్యము తటస్థంగానే ఉంటుంది. మధ్యప్రాచ్యంలోని బ్రిటిష్ రాజ్యమును అనగా, సిరియా మొదలైన ప్రాంతాలను జర్మనులు ఆక్రమించుకోదలచినయెడల, జర్మనులు టర్కీమీదకు రాకుండా దానిని విడిచిపెట్టి ప్రక్కగా పొరుగు రాజ్యాలమీదనే పోయెదరు. క్రీటు దీవిమీదకు ఇదివరలో జర్మనులు తమ విమానాలమీదనే సేనలనుపంపి క్రీటులో దింపినట్లుగా సైప్రసులో దింపుటకు వీలులేదు. అప్పుడు క్రీటుకు చాలా సమీపంగా ఉన్న గ్రీసులోనుండి జర్మనులు తమ సేనలను పంపగల్గిరి. అటువంటి సౌకర్యం ఇప్పుడు సైప్రసులోఉన్న బ్రిటిష్‌వారికి ఉన్నది. ఎందువల్లననగా, సైప్రసుకు 150 మైళ్ల దూరంలోనే బ్రిటిష్ వశమందున్న సిరియా ఉన్నది. సిరియాలో బ్రిటిష్‌వారు తమ సేనలను, విమానాలను, సామగ్రులను నిల్వ ఉంచకొని, సైప్రసులో సులభంగా యుద్ధంచేయగలరు. కాని అటువంటి సౌకర్యం జర్మనులకు లేదు. సైప్రసుకు 300 మైళ్ల దూరములో జర్మనులకు

స్థావరమైన రోడ్సు అనే దీవి ఉన్నది. సైప్రసుకు 250 మైళ్లలో కాస్టల్లోరిసో అనే విమానాశ్రయం ఉన్నది. దీనిని జర్మనులు ఉపయోగించుకోవచ్చును. ఇంతకన్న సైప్రసుకు సమీపంలో జర్మనులకు స్థావరములు అసంభవం. సైప్రసుకు జర్మను విమానాలు వస్తే, క్రీటులో మాదిరిగా ఎక్కువ బాంబులను వేసికొని రాజాలవు. కొద్ది బాంబులను వేసికొని రావాలి. వానినైనప్పటికీ వెంటవెంటనే గురిచూచుకోకుండానే క్రింద పడవేసి పోవాలి. అదిన్నీగాక, క్రీటులో గత సంవత్సరం బ్రిటిష్ విమానబలం సమృద్ధిగా లేకపోవుటవల్ల జర్మనులు తీవ్రంగా విజృంభించారు. కాని సైప్రసులో పరిస్థితి ఇప్పుడు ఆవిధంగా లేదు. ఇచట బ్రిటిష్ విమానదళములు ఎక్కువగా సమకూర్చబడియున్నవి.

సైప్రసులో చేర్చబడియున్న సేనలలో కొంత భాగం ఇంగ్లాండునుంచి వచ్చింది. మరికొంత భాగం ఇండియానుంచి వచ్చింది. ఇండియానుంచి వచ్చిన సైన్యంలోని మహమ్మదీయులు తమ మతస్థులే చాలామంది ఇక్కడ ఉండుటవల్ల స్వదేశంలోనే ఉన్నట్లుగా ఉల్లాసంగా ఉన్నారు. సైప్రసులోని జనాభాలో అయిదోవంతుమంది మహమ్మదీయులు.

సైప్రసులో చాలా బందోబస్తులు చేయబడినవి. రస్తాలు చాలా నిర్మింపబడినవి. సిమెంటుతోను కంకరతోను చాలా సైనికాశ్రయములు నిర్మింపబడినవి. ఈ మిలిటరీ పనులమూలంగా ఇచటి జనానికి చాలామందికి కూలి పనులు లభించాయి. వర్తకపు రవాణాలు క్షీణించడంవల్ల పనిలేకుండాఉన్న పాటకపు జనులకు జీవనోపాధులు లభించాయి.

ఈ బందోబస్తులన్నీ సైప్రసు దీవిలో చేయబడుటవల్ల,—మాల్టాదీవి ఎంత ధైర్యంగా శత్రు విమానదాడులను ఎదిరించి నిలువగల్గుచున్నదో, అదేవిధంగా సైప్రసు దీవికూడా శత్రువును తీవ్రంగా ఎదిరించగలదు.

# పోలెండు కన్యలను జర్మనులు బలాత్కరించుట.

## జర్మను జనసంఖ్యాభివృద్ధికై ఆందోళన.

పోలెండు వార్తా ప్రచురణ శాఖ యొకటి అమెరికాలోని న్యూ యార్కు నగరంలో ఉన్నది.—అక్కడ ఆ వ్యవహార శాఖకు డైరెక్టరుగావున్న స్టీఫెను రాపేగారు యీ క్రింది విషయములను తెలియజేస్తారు :—

1940 వ సం॥లో జర్మనీలో శిశు జనన సంఖ్య అత్యుచ్ఛదశలో ఉంది. జర్మను పురుషులు జర్మను స్త్రీలనే వివాహమాడవలెనుగాని సంకర జాతి సంతానము జర్మనీలో ఉండకూడదనే సిద్ధాంతం జర్మనీలో అమలునందున్నది. కాని యిప్పుడు ఆ నియమం పోయింది—ఎందుచేత ననగా, జర్మనుజాతిలో జననసంఖ్య తగ్గింది. జర్మను పురుషులు పోలెండు స్త్రీలతో సంగమించి సంతానమును కనవచ్చునని జర్మను అధికారులు అనుమతిస్తున్నారు. పోలెండు జాతిని సంస్కరించుటకు ఒక ఉద్యమమును జర్మనులు ప్రారంభించారు. పోలెండు దేశ పశ్చిమ ప్రాంతంలో హెలెనో అనే పట్టణం ఉన్నది. అచట "పోలెండు జాతి సంస్కరణాశ్రయము" అనేది ఒకటి ఏర్పాటుచేయబడింది. లోడ్జాండు పరగణాలోను, పోమ్నాను పరగణాలోను ఉన్న పోలెండు కుటుంబములలోని మంచి మంచి ఆడపిల్లలు జట్లుజట్లుగా మాయమై పోతున్నారు. వాళ్ల నందరిని ఆ సంస్కరణాశ్రయమునకు పంపిస్తున్నారు. అచట వాళ్లను డాక్టరులు పరీక్ష చేసిన తర్వాత జర్మనులతో వాళ్ల సంభోగం చేయుటకై జతకలుపుచున్నారు.

# చైనా స్త్రీలు యుద్ధరంగములకు వచ్చుట.

ప్రస్తుతం చైనాకు రాజధానీనగరంగా ఉన్న చంకింగు నగరంలోఉన్న హారిసను ఫార్మనుగారు అమెరికాలోని న్యూయార్కు టైమ్సు పత్రికకు యీ క్రిందివిధంగా వ్రాశారు :—

చిరకాలంనుంచీ చైనా స్త్రీలు ఇండ్లలోని పనికత్తెలవలె పురుషులనే ఆశ్రయించుకొని ఉండుటకు అలవాటుపడి ఉన్నారు. చైనా స్త్రీలు తమ పాదాలనుకూడా పెరుగనివ్వకుండా, పరుగెత్తుటకు

## బ్రిటిష్ జలాంతర్గామి గస్తీకి బయలుదేరుట.



జలాంతర్గామి కొంతకాలం సముద్రంలో గస్తీ తిరిగి శత్రునావలను ముంచిన పిమ్మట, తిరిగి తనకు కావలసిన టార్పెడోలను, యితర సామగ్రులను ఎక్కించుకొనుటకు తన తల్లి నావవద్దకు చేరుతూ ఉంటుంది. అక్కడ ఏవైన మరమ్మతులుకూడా జలాంతర్గామికి చేసినపిమ్మట తిరిగీ ఆ జలాంతర్గామి గస్తీకి బయలుదేరుతుంది. ఈ బొమ్మలో బ్రిటిష్ నావికులు జలాంతర్గామియొక్క ఫిరంగులను బారుచేయుచున్నారు. ముంచబడిన శత్రు నావలలోనుంచి రక్షింపబడిన శత్రు నావికులు మాత్రము 1,276 మంది ప్రస్తుతం బ్రిటిష్‌వారికి యుద్ధ ఖైదీలుగా ఉన్నారు.

---

వీలులేకుండా ఇనుప చెప్పులు తొడుగుకొని, స్వాతంత్ర్యంలేకుండా ఉంటూఉన్నారు. కాని యిప్పుడు వారిలో చాలా మార్పు ఏర్పడింది. నేడు చైనా స్త్రీలు కొందరు సోల్జరులవలె గట్టి దుస్తులను ధరించి యుద్ధరంగాలలో పనిపాటులు చేయుటకు పోవుచున్నారు. వారిని తర్ఫీయతు చేసేటటువంటి సైనిక శిబిరాలకు హాజరవుతున్నారు.

బర్మాలో యుద్ధముచేయుటకై పంపబడిన చైనాసేనలతో చాలామంది చైనా స్త్రీలుకూడా వెళ్లియున్నారు. అచటి చైనాసైనికుల వినోదార్థంగా యీ చైనా స్త్రీలు అక్కడ సంగీత కాలక్షేపములు చేస్తున్నారు. నాటకములను ఆడుచున్నారు. ఆటలు ఏర్పాటుచేస్తున్నారు. అచటి బర్మావారికి యీ చైనాసైనికులకు మధ్య ద్విభాషీలుగా చైనాస్త్రీలు వారి మాటలు వీరికి, వీరి మాటలు వారికి అర్థమయ్యేటట్లుగాచేసి సహాయం చేస్తున్నారు. అందువల్లనే బర్మాలోనికి పంపబడిన చైనా సైనికులు బర్మా ప్రజలయెడల చాలా సౌమ్యంగా సరసంగా ప్రవర్తించగలిగినారు. చైనా సైనికులకు కావలసిన వస్తు సామగ్రులకు వెలయిచ్చి బర్మావారివద్ద కొనుక్కొనుచున్నారు. చాలా మర్యాదగా ప్రవర్తింపగల్గు చున్నారు.

---

# పౌరజన యుద్ధసహాయం.

కలకత్తాలోని స్టేట్సుమను పత్రికలో యీ క్రిందిరీతిగా ఒక వ్యాసం ప్రకటింపబడెను :—

జపాను విషయములో ఇండియాలోని ప్రజలు భిన్నతత్వాలుగా ఉన్నారనిన్నీ, వీరు నాలుగు రకాలుగా ఉన్నారనిన్నీ గాంధీజీ యీ క్రిందివిధంగా విభజించినాడు :—

(1) బ్రిటిష్‌వారిచే సమకూర్చబడిన భారతీయ సైనిక పటాలములు ఆయుధాలతో జపానువాళ్లను ఎదిరించి పోరాడుటకు సిద్ధంగానే ఉన్నాయి. (2) బ్రిటిష్‌వారి దాస్యంలోనుంచి భారతీయులకు విమోచన కల్పించేటందుకు జపానువారు వస్తే మంచిదే అని వాదించే భారతీయులు చాలామంది ఉన్నారు. ఇండియాకు స్వాతంత్ర్యం ఇచ్చి జపానువారు వెళ్లిపోతారని వారి ఊహ. (3) ఏ గవర్నమెంటు వచ్చినాసరే మాకేమీ సంబంధము లేదని తటస్థంగా ఉండే భారతీయులు కొంద

రున్నారు. (4) అహింసా తత్త్వములో నమ్మకం కలిగిన సత్యాగ్రహులు కొందరు తమ ఇళ్ల వాకిళ్ల జపానువారు తీసుకొంటే మాట్లాడకుండా సమర్పించి, వారితో తర్వాత సహాయ నిరాకరణం చేస్తామని అనుచున్నారు.

పై జెప్పిన నాలుగు పార్టీలేగాక ఇండియాలో ఇతర పార్టీలు చాలా ఉన్నవని గాంధీజీ గ్రహించడంలేదు.

(ఏ) ముఖ్యంగా యీ దేశంలోని 10 కోట్ల మహమ్మదీయులు పూర్తిగా జపానువారి యెడల ద్వేషముతో ఉన్నారు. బ్రిటిష్‌వారి ఏలుబడిలో యీ మహమ్మదీయులకు కొన్ని కష్టనిష్ఠురములు ఉంటే ఉండవచ్చు. కాని జపానువాళ్లంటే యీ మహమ్మదీయులకు గిట్టదు. సరిహద్దు రాష్ట్రాలలోని మహమ్మదీయులుకూడా జపానువారి యెడల ద్వేషం వహించియున్నారు. బెంగాలులోను, పంజాబులోను, అస్సాములోను, ఆరకానులోను ఉన్న మహమ్మదీయు లందరికి జపానువాళ్లంటే గిట్టదు. ఈ మహమ్మదీయులందరూ పటాలములలో విరివిగాచేరి పోరాడుటకు సిద్ధంగా ఉన్నారు. (బి) స్వదేశ సంస్థానాధీశులు యుద్ధంలోకి తమంత తామే దిగి శత్రువును ఎదిరించుచున్నారు. (సి) కిసాను సభలలోచేరిన వారందరూ ఇదివరకు కాంగ్రెసుకు అండగా జేరియున్నవారే. ఈ యుద్ధం ప్రజా స్వాతంత్ర్యంకొరకు చేయబడుచున్న యుద్ధమేఅని అంగీకరించి వారందరూ జపానువాళ్లను ఎదిరించవలెనని తీర్మానం చేసారు. కాంగ్రెసు మహాసభ గొప్పగొప్ప ధనికులచే పోషింపబడే సంస్థయని నిందిస్తున్నారు.

(డి) ఈ దేశంలోని ఆదిమ నివాసులైన అడవి జాతుల తెగలవారు, నాగులు, సంతాలులు, భిల్లులు పూర్తిగా శత్రువును ఎదిరించి పోరాడవలెనన్నారు. కాని కాంగ్రెసు ధోరణిని వారు ఒప్పుకోలేదు. (ఇ) ద్రావిడదేశంలోని బ్రాహ్మణేతరులందరూ జపానువారి నిరంకుశ దౌర్జన్యమును ఎదిరించి పోరాడవలెనని ఖండితంగా తీర్మానించారు. దక్షిణ భారత దేశంలో యుద్ధ సహాయార్థం ప్రజలందరూ తోడ్పడవలెననే పట్టుదలతో పనిచేయుచున్నారు. (ఎఫ్) ఇండియాలో వెనుకబడియున్న జాతుల వారందరూ బ్రిటిష్‌వారితోచేరి జపానును ఎదిరింప నిశ్చయించారు. (జి) ఆంగ్లో యిండియనులు. (హెచ్) భారతీయ క్రైస్తవులు. (ఐ) భారతీయ లేబరు ఫెడరేషను వగైరా కార్మిక సంఘములు. (జె) రాడికలు ఫాసిస్టు ప్రతికూల పక్షమువారు. (కె) కమ్యూనిస్టులు. (ఎల్) క్షత్రియులు. (ఎం) మితవాదులు. (ఎన్) భారత దేశంలోని విద్యార్థి సంఘములు—ఇవి అన్నియు కూడా జపానును ద్వేషించి జపానుతో పోరాడవలెననే స్థిరసంకల్పంతో ఉన్నవి.

పై జెప్పిన పార్టీలన్నియుచేరి ఇండియాలోనే జనసంఖ్యలో మూడింట రెండువంతులుగా లెక్క తేలుచున్నవి. కనుక కాంగ్రెసు పక్ష మొక్కటే యీ దేశప్రజలతరఫున జవాబు చెప్పగలదని మాట అసత్యం. కనుక బ్రిటిష్‌వారికి ఇంత ప్రజాసంఘము అండగా నిలిచియున్న సందర్భంలో బ్రిటిష్‌వారు యీ జనాంగ బలమును వినియోగించి ధైర్యమునువీడక శత్రువు నెదిరించి పోరాడుట కెట్టి అభ్యంతరమును లేదు.

# జపాను వైకుంఠపాళి.

మన యిండ్లలో వైకుంఠపద సోపానపటము అనే ఆటలాడుకొనుటకు ఉపయోగపడు పటము తరచు కన్పిస్తూ ఉంటుంది. గవ్వలు పాచికలు మాదిరిగావేసి చిత్తుఅయిన గవ్వలను లెక్కపెట్టి ఆ గవ్వల లెక్క ప్రకారంగా పటములోని గళ్లల్లో మన పాచికను పైకి జరుపుతూఉండాలి. ఒక్కొక్కప్పుడు ఏ గడిలోనైనా నిచ్చెనవచ్చితే సరాసరిగా రెండు మూడు వరుసలు దాటి స్వర్గానికి సమీపంగా పోవచ్చును. లేదా మన దురదృష్టంవల్ల ఏదైనా చిన్న పాముగాని పెద్ద పాముగాని కరిస్తే కొన్ని వరుసలగళ్లవరకు క్రింది మెట్లులకు దిగజారి అంతకంతకు అధోగతి పాలు కావలసి వస్తుంది. మన కర్మానుభవ సిద్ధాంతం యావత్తు యీ వైకుంఠపాళి ఆటలో నిత్యం ప్రజలకు బోధపడేటట్లుగా పూర్వకాలపు వాళ్లెవరో యీ ఆటలాడుకొనేపటమును చాలా సొంపుగా తయారుచేసారు. మనము ఎన్నో జన్మలు ఎత్తిననే తప్ప చిట్టచివరకు ముక్తి పదవిను పొందలేము. అహంకారం అనేది పాపకర్మ చేయిస్తుంది. ఈ అహం అనే పాము మూలంగా ఉత్తమ జన్మలలోకి క్రమంగా పైకి వచ్చినప్పటికి వైకుంఠానికి బెత్తెడు దూరంలోనే ఉన్నప్పటికీ, పెద్దపాము కరచినట్లుగా పైనుంచి క్రిందకు అనగా, ఉత్తమ జన్మలోనుండి సరాసరి

అధోగతిపాలై పోవడంలో ఆశ్చర్యమేమీ లేదు.

జపానువాళ్లకు ప్రస్తుతం విజయము లభించి నట్లుగానే ఉంటుంది. కాని, "సామ్రాజ్యాధిపతులము కావాలి" అనే అహంకారంతో అక్రమంగా చైనామీదకు; బర్మామీదకు దండెత్తిన జపానువాళ్లకు యీ అహంకారమే చిట్టచివరి దశలో, పెద్ద పాముపలెకరచి "హరహర మహదేవ్!" అంటూ ఒక్కసారిగా, క్రిందికి పడతోస్తుంది. జపాను సేనలు ఎక్కడినుంచి బయలుదేరుచున్నవనే విషయం మనము గ్రహించాలి. ఇండియాకు నాలుగువేల మైళ్ల దూరములోనున్న జపాను దేశమునుంచి బయలుదేరుతున్నాయి. అక్కడినుంచి, అంతదూరంనుంచి బయలుదేరిన ఆ జపాను సేనలు, చైనాలో ప్రవేశించి కొంతదూరం విస్తరించి, ఫ్రెంచి ఇండోచైనాను ఆక్రమించి, అక్కడినుంచి తాయిలాండులోకి ప్రవేశించి, తాయిలాండులోనుంచి మలయాలోకివచ్చి దానిని ఆక్రమించి, సింగపూరును వశపరచుకొని, దానికింకా దక్షిణంగాఉన్న డచ్చి యీస్టు ఇండీసు దీవులను, టిమారు దీవిని ఆక్రమించి, ఫిలిప్పయిను దీవులలో విజృంభించి అక్కడ తమ బావుటాను నిలువబెట్టి, ఆఖరుకు బర్మాదేశంలోకి ప్రవేశించారు, 'బర్మా' అనే మాట బ్రహ్మా అనే సంస్కృత శబ్దంలోనుంచి వచ్చినదే. బర్మాదేశం అంటే "బ్రహ్మాదేశం" అని అర్థము. ఇంద్రుడు ఎక్కి తిరిగేటటువంటి తెల్లని ఏనుగు పేరు ఐరావతం. అటువంటి తెల్ల ఏనుగులు బర్మాలో ఐరావతీ నదీతర ప్రాంతపు అరణ్యములో అక్కడక్కడ లభిస్తాయి. కాబట్టి పూర్వం పురాణాలలో చెప్పిన ఇంద్రలోకంకూడా అదే కావచ్చు. హిమాలయ పర్వతాలకు పైన ఉత్తరంగా, హిమాలయ పర్వతాలు దాటగానే, బ్రహ్మపుత్రా నది ప్రవహించే పర్వత లోయమీదుగా హిమాలయ పర్వతమును దాటి వెళ్లితే, టిబెట్టు అనే దేశంవస్తుంది. దీనినే సంస్కృతంలో "త్రివిష్టపం" అని అంటారు. త్రివిష్టపం అనగా స్వర్గం అని అర్థము. ఈ టిబెట్టు రాజ్యం చైనాను ఆశ్రయించుకొని ఉన్న స్వతంత్ర రాజ్యం. జపానువాళ్లు దక్షిణంగా వెళ్లి జావా ద్వీపమును (యవనద్వీపమును) సుమాత్ర ద్వీపమును (సువర్ణదీవిని) ఆక్రమించిన తర్వాత, ఊర్ధ్వగతిగా బ్రహ్మలోకంలోకి చేరవలెనని యాత్ర సాగించారు. బ్రహ్మలోక ప్రాప్తికాగానే, ఇంకా ఉత్తరంగానే పోతున్నారని వార్తలు వస్తున్నాయి. బర్మాలోనుంచి చైనాలోనికి పోవచ్చును. టిబెట్టును (త్రివిష్టపమును అనగా స్వర్గమును) కూడా ఆక్రమించవలెననే కోరికతో బయలుదేర వచ్చును.

పూర్వకాలంలో హిరణ్య కశిపుడు ఘోరమైన తపస్సును అనేక సంవత్సరాలు చేశాడు. అన్ని లోకాలు జయించేటంత శక్తిని సంపాదించాడు. ఇంద్రలోకంకూడా జయించాడు. "ఇన్ని లోకాలు జయించినటువంటి నేనే భగవంతుణ్ని—నేనుకాకుండా ఇంకో సృష్ట్యాధిపతి ఎవడున్నాడురా?" అని భగవంతుణ్ని కూడా ధిక్కరించి మితిలేని అహంకార పూరితుడైనాడు. ఆఖరుకు హిరణ్య కశిపుడు ఏ రాజమందిరంలో సింహాసన మెక్కి కూర్చున్నాడో, ఆ సింహాసనం దగ్గర నున్న స్తంభమే బ్రద్దలై, అందులోనుంచి నరసింహావతారం అవతరించి, హిరణ్య కశిపుని కడుపుచీల్చివేసి, హిరణ్యకశిపుని సంహారంచేసింది. హిరణ్య కశిపుడు మనిషిచేతులలోగాని మృగాల చేతులలోగాని తనకు మరణములేకుండా వరములుపొంది పదునాలుగు లోకాలు జయించాడు. కాని, ఆఖరుకు మనిషియున్నూ మృగమున్నూ కానటువంటి నరసింహావతారం చేతులలో మరణించాడు. జపానువాడుకూడా తనకు బ్రిటిష్ సింహం చేతులలో చావులేదనే గర్వంతో ప్రవర్తిస్తున్నాడు. తనకు అమెరికా వారివల్ల అపజయమురాదని అహంకరించాడు. బ్రిటిష్‌వారిమీదను, అమెరికావారిమీదను యుద్ధం ప్రకటించాడు. రష్యామీద మాత్రం యుద్ధం ప్రకటించలేదు. చైనాతో వ్యవహార లాంఛనంగా యుద్ధం ప్రకటించకుండానే అయిదేళ్లనుంచి చైనాతో యుద్ధం సాగిస్తున్నాడు. ఎన్ని రాజ్యాల మీదకు దండెత్తినా, తనకు ఎదురు నిల్చేవాడు లేడనే అహంకారంతో బయలుదేరాడు.

కాని, మొన్ననే జపానుకు ముఖ్యపట్టణమైన టోకియో నగరంమీద అమెరికను విమానాలు బాంబులు వేసినాయి. జపానుమీదనే ఘోరంగా తీవ్రంగా బాంబులువేసి జపానును భస్మం చేయవలెననే దృఢప్రతిజ్ఞతో అమెరికావారు ప్రయత్నాలు చేస్తున్నారు. జపానువాడు తన స్వదేశం విడిచి నాలుగువేల మైళ్ల దూరంవచ్చి బంగాళాఖాతంలో అండమాను దీవులలో మకాం వేశాడు. ఆఖరుకు యీ అఖాతంలో దిగిన తర్వాతనే,

వానిపని అగాధంలోకి దిగినట్లవుతుంది. హిందూ దేశంమీదకు దండెత్తి రావలెననే కాంక్షతో హిందూమహాసముద్రంలోకి రాగోరుచున్నాడు, అందుకనే మెడగాస్కరుకు బ్రిటిష్‌వారు ముందు గానే చేరారు. సింహళంకూడా ఆక్రమించవలె నని దండెత్తి వస్తాడట. ఇక్కడ సింహళం వద్దనే, మన హిందూ దేశంవద్దనే వానికి తప్పకుండా చావు మూడగలదు. ఇక్కడ భారతదేశాన్ని రక్షించుకొనుటకోసం భారతీయ సైన్యాలు అపారంగా బ్రిటిష్‌వారి సహాయంవల్ల తయారవుతున్నాయి. భారతదేశంలో 40 కోట్ల జనసంఖ్య ఉన్నది. చైనాలో 45 కోట్ల జను లున్నారు. అక్కడ చైనాలో జపానువాడు అయి దేళ్లనుంచీ యుద్ధం చేస్తున్నప్పటికీ, ఆ యుద్ధం అనంతంగానే సాగుచున్నది. అదేవిధంగా భారతదేశంలోకూడా జపానువాడికి అనంతమైన పోరాటం సాగుతూనే ఉంటుంది. ఇటు చైనా తోను, ఇండియాతోను దీర్ఘ యుద్ధం చేస్తున్న కాలంలో, అమెరికా విమానాలు జపానుమీదనే ప్రత్యక్షమై, వాడి స్వదేశ స్తంభమునే బద్దలుచేసి వాడి స్వరాజ్యమునే సర్వనాశనం చేయగలవు. బ్రిటిష్ సింహముయొక్క తంత్రంవల్లనే నాశనంకాగలడు. బ్రహ్మదేశం జయించి త్రివిష్టపమునకు (అనగా స్వర్గానికి) బెత్తెడు ఎడంగా విజృంభించి, స్వర్గారోహణం చేయ డానికి సమీపించుచున్న జపానువాళ్లకు టోకియో నగరంమీదనే బాంబులుపడి, స్వంత దేశమే సర్వ నాశనమైపోయే రోజులు వచ్చాయి. వైకుంఠానికి సమీపించుచున్నవాడికి ఆఖరుకు పెద్ద పాము కరచినట్లవుతుంది. పరమపద సోపానాలు ఎన్ని పైకెక్కినా, అహంకారంతో, సామ్రాజ్యాహం కారంతో విజృంభించేవాడికి పెద్దపాము కరవక తప్పదు. అధోగతి తప్పదు. ఆ శత్రు పరా జయం త్వరలోనే ఉన్నది. సింహళంవద్దకు వచ్చినప్పుడే నరసింహావతారం ప్రత్యక్షం కావచ్చు. భారతదేశం జపానువాళ్లకు భరింపజాలని దుర్భర దేశం కాగలదు. బ్రిటిష్ ప్రధానియైన చర్చిల్లు గారు సూచించిన అంత్యవిజయం తప్పక సమీ పిస్తోంది. బ్రిటిష్ సింహపు చేతులలోనే సంహా రం తప్పకుండా జరుగుతుంది.



# బర్మాలోని మద్రాసు పటాలములు.

మద్రాసు రాష్ట్రవాసులు కొన్ని పటాలము లుగా ఏర్పరుపబడి మైనర్లుగాను, సాపర్లుగాను (యుద్ధరంగంలో పటాలముల మార్గ సౌకర్యము లను బందోబస్తులను చేయునట్టి మార్గ కర్మకారు లుగా) బర్మాలో పనిచేయుచున్నారు. భారతదేశ సైన్యముల పరిశీలించు ప్రేక్షక ప్రముఖు డొకడు బర్మాకు వెళ్లిచూచెను. వారితో వారి స్వభాషలో మాట్లాడినప్పుడు వారు పరమానందభరితులైనా రు. వారి మకాము యావత్తూ చాలా పరిశుభ్రంగా ఉంది, వారితో కలిసి కమ్మని తేయాకు పానీయం తాగి చాలాసేపు సంభాషణచేసాడు. వారివద్ద ఒక పెంపుడు బర్మాకోతి ఉంది. అది అందరి బుజాల మీదకు ఎగురుతూ ఉంటుంది. ఆ పటాలపు ఆఫీ సర్లు (పై అధికార్లు) ఒక గుహలో మకాముచేసి యున్నారు. వారితో చాలాసేపు సంభాషించగా వారుచేసిన అనేక ఘనకార్యాలు వివరించి చెప్పారు. ఈ మద్రాసు పటాలములో ఇంత వరకు 5 గురికి మాత్రమే ఒక బాంబు ప్రేలుడు వల్ల గాయములైనవి. వీరు సయాంలోకూడా పనిచేసారు. ఇటువంటి మద్రాసు పటాలము యొక్క సామర్థ్యానికి మద్రాసు ప్రజలందరూ గర్వించవచ్చును.

MADRAS: PRINTED AND PUBLISHED BY THE SUPERINTENDENT, GOVERNMENT PRESS.